# గుహుడు

By

KODALI SATYANA[redacted]



PUBLISHER :

**Pali Pera Raju,**

ELLORE.

1932

 4 Annas.

# గుహుడు

గ్రంథకర్త:

కొడాలి సత్యనారాయణరావు.



పబ్లిషరు:-

పాలి పేరరాజు,

ఏలూరు.

---

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలా ముద్రితము.

1932.



(వెల రు 0—4—0

# గుహుడు

గీ. జలదములనుండి పిడుగులు ♦ జాఱునట్లు
మంచివారికి ఖలులు జ ♦ నించుచుండ్రు

(చి॥ లక్ష్మీనృసింహాకవి.)

ఇక్ష్వాకునృపాలుండు రఘువంశములోనివాఁడు. ఈ యిక్ష్వాకుని కడఁగొట్టు కొమరుండు దండుఁడు. దండుఁ డతి క్రూరుఁడు. చిన్ననాటనుండి తలిదండ్రులు వీని నెంతయో వృద్ధిలోనికిఁ గొనిరావలయునని విశేషమగు కృషిఁ జేసిరి. కాని ప్రయోజనము లేకపోయెను. అందుచే దండునకుఁ జదువు సంధ్య లేమియు నబ్బినవి కావు. చదువు రాకున్నను గృహకార్య నిర్వహణమునందేమి, రాజకీయ కార్యములందేమి యాతనికిఁ బ్రసక్తి లేదు. కానితీఱుబడియు లేదు. వీధులలోఁ గొంటెపిల్లలతోఁ గలిసి క్రూరకార్యము లొనర్చి వంశమున కపకీర్తిఁ దెచ్చుట కన్న సుఖముగాఁ దినుచు నింటఁ గూర్చున్నఁ జాలునని వాని తలిదండ్రుల యాశయము. కాని వారి యాశయము నాతఁడు తీర్చువాఁడా? ఎల్లప్పుడును బయటనే తిరుగుచుండెడివాఁడు. సాటిబాలుర నాటలమిషచేఁ బిలిచి యేదియో మిషఁ గల్పించి

వారల నందఱిఁ జావమోదుటయో, ఋషిపుంగవు లేరైనఁ గన్పించిన వారికమండలోదకమును బారబోసియో, వారిచంకల యందుండు దండంబుల లాగికొని కొట్టఁబోవుటయో, వారి యునికిఁ జూచి వెక్కిరించుటయో, చేయుచుండెడివాఁడు. ఒకొక్కప్పు డాడుకొనవచ్చిన బాలుర దయా దాక్షిణ్యరహితుఁడై చంపుచుండెడివాఁడు. వాని దారుణ బాధలఁ జూచి సహింపఁజాలక; బురుషులును, ఋషిపుంగవులును యిక్ష్వాకునికడ కొకనాఁ డరిగి" అయ్యా మీ కుమారుని దుడుకుచేష్టలు మహిమ్నాపురంబున నుండనిచ్చునటులఁ గాన్పించుటలేదు. ప్రభుకుమారుండగుటచే నయభయంబుల ననేక పర్యాయములు మందలించి చూచితిమి. తమతో నెప్పటి కప్పుడే తెలుపుకొందమన్న నయ్యవి కొండెములుగాఁ బరిణమింపఁ బడునని యింతకాల మూరకుంటిమి. ఏనాటికైన యోగ్యత కలుగఁగూడదా యని నిరీక్షించితిమి. ఇఁక మాకు శాంతింపఁగలిగెడి యోపికలు లేవు. మీరు మాకుఁ బాలకులు. పాలితులు పడెడి యవస్థల నివారించెడి భారము పాలకులపై నున్నయది. సాధుజన సంరక్షణులును ధార్మికప్రవర్తనులును, సత్యమార్గానుష్ఠానపరులును, దుష్టశిక్షణ శిష్టరక్షణ పరాయణులును, రఘుకులాంబుధి సోములును నగు మీరు మమ్ముల నీతరుణంబునఁ గాపాడకున్న మామూటముల్లెల నెత్తిపైఁ బెట్టుకొని, యాలుబిడ్డల వెంటనిడుకొని

యే కానగంతలకో, యే కొండగుహలకో, పారిపోవలసినవార మగుదుము. మీ కనిష్ఠపుత్రుండు బాలురఁబట్టి చంపుచున్నాఁడు. బాలికలను నానావిధముల హింసించుచున్నాఁడు. నీరంబుఁ దెచ్చుకొనుటకై వీథిలోని కరుగు మాయాఁడువాండ్రపై రాళ్లు రువ్వుట మున్నగు దుష్కార్యములఁ జేయుచున్నాఁడు. ప్రాపంచిక సౌఖ్యములకు రోసి శ్రీమన్నారాయణమూర్తిని హృదయఫలకంబున నిలిపికొని తపోవృత్తినుండు మహనీయుల గోల్లుమని యేడ్పించుచున్నాఁడు. మాకుఁ దగిన బ్రతుకుఁ దెఱవుఁజూపకున్నచో మేమియ్యెడ జీవించుట దుర్లభము. మమ్ముల నెట్టులేని నుద్ధరించి రఘుకులాన్వయులాపనుద్ధారకు లనియెడి మేటిబిరుదంబును సార్థకపఱచుకొమ్మని మొఱఁబెట్టిరి. ఇక్ష్వాకునకుఁ దనయునిపైఁ గోపము వచ్చినది. "మమకారము నీసమయంబునఁ జంపుకొనకున్నఁ బ్రజాఘోషము మితిమీఱఁగలదు. కావఁ బుత్రునెచటికేనియుఁ బ్రవాస మంపుటయే యుత్తమ"మని నిశ్చయించుకొనినంతలో నప్రయత్నముగాఁ గనుఁగొనలనుండి యశ్రుకణంబులు రాలఁ జొచ్చెను. "ఆహా! రఘుకులంబున కట్టియపకీర్తి వాటిల్లుచున్నది? తండ్రీ! విద్యాబుద్ధులు నేర్చుకొనుము. సమరపాండితి నలవడఁ జేసికొ"మ్మని యెన్నివిధంబుల బ్రతిమాలి బోధించినను బ్రయోజనము లేదయ్యె. కన్నకుమారు నెడఁబాసి పుత్రమోహము నెటులఁ జంపుకొందును? నాబ్రతు కడకత్తెరలోని

పోఁకచందాన నున్నదే? నేనిపు డేమిసేయుదును? ప్రవాసశిక్ష విధించిన నాటనుండియు, నిల్లాలిదుఃఖము నెటులఁ బాపుదు”నని కొంతవడి విచారించెను. గాని యెంతగ నాలోచించినను గుమారుని విడనాడుటయే శ్రేయముగాఁ దోఁచుటచే నటు లొనర్చుకొనుటకే స్థిరపఱచుకొని పుత్త్రుని రావించి “ఓయీ! బాలకా! నీ దారుణకర్మలఁగూర్చి జను లనేకవిధంబుల మొఱవెట్టుకొనుచున్నారు. నీకృత్యమునకుఁ దగిన దారుణ శిక్షల విధింప నధికారముఁ గలవాఁడనయ్యుఁ బుత్త్రవాత్స ల్యమున నటులొనర్పఁ జాలకుంటిని. కాన నీవీతక్షణమే యీపు రంబును విడిచి వింధ్యగిరిప్రాంతములఁజేరి యటజీవింపుము పొ” మ్మని ముదల నొసంగెను.

తండ్రిగదా యనెడి విషయ మెటులున్నను ప్రభుని యాజ్ఞ మీఱుట కర్హతలేనందున దండున కత్తలంబు వీడి పోవక తప్పినదికాదు. ఈవార్త నాలించి దండునితల్లి యెంతయో విలపించినది; కాని లోకహితార్థమై యటులొనర్పక తప్పదని చెప్పి యిక్ష్వాకుఁడు భార్య నూఱడించెను. దండుఁ డాయూరు విడిచిపోయెను. వానినిష్క్రమణమున కాయూరిప్రజలెల్లరును హర్షించినవారలై నాటఁగోలె సుఖముగాఁ గాలక్షేపముఁ జేయుచుండిరి. తలిదండ్రుల హితోక్తినాలింపకున్నను, విద్యల నేర్వకున్నను, సజ్జనసాంగత్యముఁ జేయకున్నను, ఋజుప్రవర్త నములేకున్నను, దురాకృతముల నాచరించుచున్నను జననీజనకు

“లట్టి కుపుత్రత్వమునకన్న నపుత్రత్వమే శ్రేయస్కరముగఁ
దలంతు” రని యీ ప్రకరణము యొక్క ఫలితార్థము.

(2)

జనకునిచే వెడలఁగొట్టఁబడిన దండుఁడు వింధ్యపర్వత పరిసరప్రదేశములఁ జేరి యచట వసించెడి రక్కసిమూఁకల సహవాసముఁ జేయుచుఁ దన దుండగపు కార్యముల విడువకఁ గ్రమక్రమముగా నా ప్రాంతముల వసించువారలకు నాయకుఁడయ్యెను. దండుఁడు తాను నివసించు ప్రదేశమున నొకపురమును నిర్మాణముఁజేయించి యా పురంబునకు “మధువంత”మని పేరుఁబెట్టెను. ఈదండుఁ డరణ్యముల వసించి దానవకులనాయకుండగుటచే శుక్రాచార్యుం డీతనికాచార్యుండయ్యెను. ఇప్పుడు వీనికి సంపూర్ణయౌవనదశవచ్చుటచేఁ గామాతురులకు నిష్టదైవమగు మదనుని సేవింపవలసినవాఁడయ్యెను. ఆతనిప్రహారణములకు లొంగవలసినవాఁడయ్యెను. ఆమదనుని దారుణప్రహారణముల కాగలేక దండుఁడు లేజవ్వనులపై దాడిసాగించి బలవద్విజయుఁడగుచుండెను. ఈతఁడు విజయలక్ష్మినార్జించుచున్న కొలఁదియు, మదనుని విజృంభణము వీనియెడ నెందులకుఁ గొఱగాకుండెను. ఆప్రాంతమున కీతఁడే ప్రభుండైయుండుటచే నాతఁ డాడినది యాటగను, బాడినది పాటగను బరిణమించుచుండెను. అదలించెడివారు లేక, బెద

రించెడివారులేక, పెచ్చుమీఱిన పొగరుఁబోతుఁ దనమున వర్తించు నాతని వర్తనమున కాప్రాంతమునుండిపోవు పాంథులనేకులనేకవిధంబుల బాధపడుచుండెడివారు.వీనిబలవంతములకు లోనై హాహాకారములొనర్చెడివారు.వీనికివినాశకాలమెన్నఁడు ప్రాప్తమగునా యని దైవమును ధ్యానించుచుండెడివారు.

పాపకృత్యములెన్నాళ్ళుదాఁగియుండఁగలవు? ఎన్నాళ్లు మితిమీఱుఁగలవు?దుండునకు వినాశకాలము చేఱువకు వచ్చుట చేతనే యొకనాఁడుకులగురుండగు శుక్రాచార్యుండాశ్రమంబున లేనిసమయంబుఁ జూచి యాశ్రమంబునకరిగి తపోనియతినున్న శుక్రాచార్యుని తనయను విలోకించి యామెరూపరేఖావిలాసంబుల కచ్చెరువంది యామె సాంగత్యము నభిలషించెను. పరకాంతల సహవాస మభిలషించుట మహాపాతక హేతువనియు, సతుల నభిలషించువార లెందఱో యిహపరంబులకు దవ్వైరనియు,మగవారులేని సమయముఁ జూచి యాశ్రమంబుఁ జొచ్చుట ధర్మవిరుద్ధమనియు, సజ్జన సహవాసమొనర్చి సదాచారములనలవడఁజేసికొని జీవించుట శ్రేయోదాయక మనియుఁ, దనతండ్రి కీయుదంతము తెలిసిన శపించుననియు, నాతని శాపవచనం బమోఘమనియు హితముఁగఱపెను. కాని సన్నిపాతజ్వరముచే నొడలుఁ దెలియక ప్రేలెడి రోగికి శీతలోపచారము లక్కఱకు రానియటుల నామె హితంబులన్నియు నాతనియెడ నిష్ప్రయోజనమయ్యెను. కామా

తురుండగు దండుఁడు తన మనోభీష్టము నెట్టులేని నెఱవేర్చు కొనఁదలఁచి బలాత్కారమున సఫలీకృతమనోరథుఁడయ్యెను. వెంటనే శుక్రాచార్యుం డింటికివచ్చి కొమరితవలన నడిచిన వృత్తాంతం బాద్యంతముగ నాలించి, దండునిఁ జేరువకుఁబిలిచి "యోరీ మూర్ఖుఁడా! నీకార్యకృత్యంబులఁ జాలకాలము నుండియుఁజూచుచున్నను యేనాటికేని బుద్ధిరాకుండునే" యని మనంబున నిన్నొక లెక్కఁగాఁ గొనకుండనున్నంయల కాచార్యుఁడనగు నాకే యిట్టి తలవంపుఁగూర్చితివటరా? మీ వంశమున నెన్నఁడేనినిట్టిదురాచారపరాయణులుద్భవించిరటరా రఘుకులంబునకు నీమూలమున నెట్టి యపకీర్తి వాటిల్లినదిరా! ఇదివరలోఁ బితృద్రోహివే యైతివి. ఇప్పుడు గురుద్రోహి వగుచుంటివి. నిన్నుఁశిక్షించినచో దైవద్రోహివికూడనగుదువు. లోకమున నీదుష్కార్యములు మితిమీఱఁగలవు. నిన్నుఁక విడువ రాదు. నీవు నిలుచు శతయోజన విస్తీర్ణముఁగల యీప్రదేశ మంతయు నీతో, నీస్వజనముతో రూపుమాయునట్లు మట్టివాన కురియుఁగాత" యనిశపియించెను. అమోఘమైన యాశాపవచ నమునననుసరించి యాప్రదేశమంతయు నప్పటికప్పుడే మట్టివాన కురిసి రూపరహితమయ్యెను. ఆప్రదేశమే క్రమక్రమముగా నరణ్యమయ్యెను. ఆయరణ్యమునకే "దండకాటవి" యని పేరు వచ్చినది.

చూచితిరా! దుర్మార్గకార్యము లెవ్విధిఁ బరిణమించినవో! ఎన్నటికేని దుర్మార్గమునకు వినాశకాలము రాకపోదు. దుర్మార్గులు నశింపకపోరు.

---

(3)

పూర్వ మొకఋషి యుండెడివాఁడు. వానికొక కొమరుండు కలఁడు. ఆఋషి శ్రీమన్నారాయణ చరణారవిందముల భజియించుకొనుచు జీవయాత్రను గడుపుకొనుచుండెడివాఁడు. వాని తనయుండును నటులఁ జీవించుచున్న వాఁడే. ఒక విజనారణ్యమున నొక పర్ణకుటీరము నేర్పఱచుకొని కందమూలాదులఁ దినుచు, నందుఁగల సెలయేటి నీరంబుఁ ద్రావుచుఁ గామక్రోధాద్యరిషడ్వర్గంబులఁ ద్యజించి శ్రీ పరాత్పరునే నమ్ముకొని ముక్తికాంతను బడయవలెననెడి తలంపుతోడనే యుండెడివారు గాని యన్యప్రసంగముల జోక్యంబుఁ గల్గించుకొనెడివారు కారు. ఐనను సకల ధర్మంబుల నెఱింగినవారగుటచేతను, వారి పాండిత్యము నలుదెసలఁ బ్రాకినందువలనను, యెవ్వ రేధర్మము నెఱుంగవలె ననినను యెంతదూరమైనను లక్ష్యము సేయక, వారికొఱకై వెదకికొనుచు వచ్చి తమ యనుమానముల నివృత్తిఁ జేసికొనుచుండెడివారు.

ఒకనాఁ డాబుషి యింటికడ లేనపు డొక బ్రాహ్మ ణుండు వచ్చి యాశ్రమమున ముని సార్వభౌముండు లేఁడని యాతని కొమరునివలన నెఱింగి "ఆర్యా! నాయన గారు లేకున్నను దామును తమ తండ్రిగారిని మించినవారే యగుటం జేసి నాయొనర్చిన పాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్త మేదియో యెఱింగింతురని నమ్మెదను. నేను బ్రాహ్మణుఁడ నయ్యును గాచనెయ్యంపు దోసమునం జేసి విలువిద్య నేర్చుకొన్నవాఁడనగుటచే నీమధ్య నొకనాఁడు నేనభ్యాసమునకై విడిచిన బాణమొక్కం డొకగోవునకుఁ దగులుటచే నాగోవు తత్క్షణంబున నె యసువులఁ బాసెను. ఈ గోహత్యాపాతకమునుండి నేనెటులఁ దప్పించుకొనఁగల్గుదునో యెఱింగించి పుణ్యముఁ గట్టుకొ" మ్మని వేఁడినంత నాబుషి కుమారుండు "ఓయీ! విప్రోత్తమా! శ్రీరామనామమును నాలుఁగుపర్యాయములు త్రికరణశుద్ధిగ నుచ్చరించితి వేని నీకా పాతకము నశించు" నన నావిప్రుండట్లొనర్చ సమాధానపడి యత్తలంబుఁబాసెను. కొంతసేపటికి బుషియు నాశ్రమంబునకు వచ్చెను. తనయుండు విధ్యుక్తముగ జనకున కొనర్చవలసిన పరిచర్యలన్నియుఁ బూర్తియైన యనంతరమునఁ దాను భూసురోత్తమునకుఁ దెల్పిన ప్రాయశ్చిత్తవిధానమునుఁ గూర్చి విన్నవించెను.

అంతఁ గుమారుని వాక్యములను విని, యామహర్షి సత్తముఁడాగ్రహమంది కనుఁగవయందించుకనెఱుపుడాల్తోపఁ గొడుకుదెసఁ జూచి "ఓయీ! గోహత్య యొనర్చినందుల కొక్కసారి రాముని పవిత్రనామమును స్మరించినఁ జాలుఁగదా! మూఁడుపర్యాయము లెక్కుడుగ రామనామమును నిరర్థకముఁ గావింపనగునా? ఆనామము నొక్కపరి త్రికరణశుద్ధిగ నుచ్చరించినంతమాత్రముననే సకలకలుషములును వమ్ములగుచుండ, నిన్నిపర్యాయము లానామమును వ్యర్థముగా వినియోగించి లేనియధికారమును బైనవైచికొంటివి గాన నిఁకటి నుండి నిషాదుఁడవై పొ"మ్మని శపియించెను.

తండ్రిగారొసంగినశాపమాతని దుఃఖార్ణవమునముంచివైచినది. తనదుర్గతికిఁ దానెంతయో వగచెను. కొంతవడి కందువలనఁ బ్రయోజనములేదనియు, నెట్టులేనిఁ దండ్రిగారిని శాంతచిత్తునిఁ గావించుటయే సర్వవిధంబుల నుత్తమ మనియు నెంచి తండ్రిగారి పాదంబులపైఁబడి "తండ్రీ! అవివేకవశమున నిట్టి యపరాధం బొనర్చితిని. ఎట్లులైన నన్ను మన్నించి శాపవిముక్తునిఁ జేయవే"యని ప్రార్థింపఁ గొంతవడి కించుక జాలికలిగి "శివునిమూఁడవకంటిమంటయు, నింద్రునివజ్రాయుధఘాతమును పతివ్రతకోపదృష్టియు, ఋషిశాపమును రిత్తవోవునే? నాయనా! స్వయంకృతాపరాధమునకుఁ దత్ఫల మనుభవింపక పోరాదు. నిన్నా రామచంద్రమూర్తియే కాపాడఁగలఁడు. శాప

గ్రస్తుఁడవై నీవు నిషాదుఁడ వగుచున్నను రామభక్తిఁ గలిగి. పవిత్రిలితివా నిన్నా రామభక్తియే ధన్యునిఁ జేయఁగలదు. అందులకై నీవెంతమాత్రమునుజింతిల్లవల" దని యూరడించెను. ఆఋషికుమారుఁడే మన కథానాయకుఁడైన గుహుఁడు. వాని కథనుగూర్చియే ముందు మీరు పఠింపఁగలరు.

(4)

ఇక్ష్వాకువంశ పయఃపారావార రాకాసుధాకరుండును, నయోధ్యానగరాధీశ్వరుండును నగు దశరథుండు పుత్రసంతానము లేమిం జేసి పుత్రకామేష్టి నొనర్చుటయు, నందులకు ఫలితంబుగా నొకదివ్యపురుషుండు పాయసాన్నంబునొసంగుటయు, నాభూవరుం డాపాయసాన్నంబును దన ముప్వురు భార్యలకును భుజియింపనిచ్చుటయుఁ, దత్ఫలితంబుగా వారలకు శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్ను లనెడి నలువురు పుత్రులు జన్మించుటయు, దశరథుండు వారల నతి గారాబమునఁ బెంచుకొనుచుండుటయు, నింతలో గాధేయుఁడు తనయాగంబునకు రాక్షసుల వలన విఘ్నంబు లనేకంబులు జరుగుచున్నవని తద్రక్షణార్థమై శ్రీరామునిసహాయ మపేక్షించివచ్చి దశరథునిఁ గోరుటయు నాతండు విడువలేక విడువలేక శ్రీరాముని లక్ష్మణ సమేతముగా విశ్వామిత్రుని వెంట నంపుటయుఁ, దోవయందు శ్రీరాముఁడు తాటకనుసంహరించి మారీచ సుబాహుల దర్ప

మడఁచి పతిశాపవశమునఁ బాషాణమయియున్న యహల్యను శాపవిముక్తఁ గావించి, మిథిలాధీశ్వరుండగు జనకుని యింట నున్న శివచాపంబును రెండుగాఁగావించి జనకుని ప్రకటనానుసారముగ సీతామహాసాధ్విని బెండ్లియాడుటయు, నయోధ్యకుఁ దిరిగి వచ్చునపుడు పరశురాముని గర్వంబూడ్చుటయు, మీ రంద ఱిదివఱకే తెలిసికొనియుందురు. పదంపడి దశరథుండు తనకబ్బిన వార్ధకదశచే జీవితకాలముననే సత్యమార్గానువర్తియు, ధర్మమూర్తియు, కృపాలవాలుండును, సమస్త కల్యాణగుణగణాభిరాముండును, బాహువిక్రమోద్దాముండును, విజయస్థేముండును, వైభవ నిర్జిత సుత్రాముండును, సత్కాముండును, బరంధాముండును నగు శ్రీరామునిఁ బట్టభద్రునిఁ గావించి వానిపరిపాలనా చాకచక్యమునుఁ గని యానందింపఁ దలఁచి, ప్రజానుమతిని బడసి నిజపురోహితుండగు వసిష్ఠునిచే సుముహూర్తము నిశ్చయింపఁజేసెను.

శ్రీరామచంద్రుఁడెవ్వఁడో యెందులకై మానవాకృతిని దశరథక్ష్మాపాలున కుద్భవించెనో వసిష్ఠమునిచంద్రునకు బాగుఁగాఁ దెలియును. తానునిశ్చయించిన ముహూర్తము కొఱఁగానిదనియు నెఱుంగును. పట్టాభిషేకముహూర్తమునకు విఘ్నంబు కలిగిన బాగుండునుగదా యని లోలోన నువ్విళ్ళూరుచునే యుండెను. కాని తన యభిప్రాయము బైకిఁ దెలియనీయఁడు.

కౌసలేయుండు సామాన్య మానవుఁడు కాఁడు. అయోధ్యానగరంబున సింహాసనముపైఁ గూర్చుండి సామంతరాజుల కప్పంబులఁ గొనుచు బొక్కసమును వృద్ధిఁ జేయుచు సుఖముగాఁ గాలక్షేపముఁ జేయుటకై జన్మించిన వాఁడునుఁ గాఁడు. ఇష్టభోగములఁ దనివిఁదీఱ ననుభవింపఁ బుట్టినవాఁడును గాఁడు. లోకకంటకులగు రావణాదుల దారుణబాధల కాగఁజాలక దేవతావర్గము శ్రీమహావిష్ణునికడ కరిగి తమ యాపన్నివారణార్థమై మొఱఁబెట్టుకొన, నాతిండు దశరథునకు కొమరుఁడనై జన్మించి దానవవంశ నిర్మూలన మొనర్చి లోకమున శాంతిఁ బ్రతిష్ఠించెద" నని యభయం బొసంగుటచేఁ; దన సమయానుకూలముగ మానవావతారమెత్తిన శ్రీవిష్ణుమూర్తి. ఈ రహస్యము వసిష్ఠుఁ డెఱుంగును. ధనుర్విద్యాది కళల నలవడఁ జేసిన విశ్వామిత్రుండుసైత మెఱుంగును. కావలసినది దానవసంహారము. అందుకొఱకై శ్రీరామచంద్రుఁ డరణ్యముల కరుగవలయును. అందుల కేదేని నొక మిషఁ గల్పింపవలయును. వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులే, శ్రీరాముని జన్మవృత్తాంత మెఱింగినపుడు దేవతలకీరహస్యమేలఁ దెలియదు? అందులకనియే పట్టాభిషేకమున కేలగ్నమును వసిష్ఠుఁడు నిశ్చయించెనో; ఆనాఁడే దేవతలందఱు నొక్కచోఁ గూడి "రావణ సంహారణార్థమై మానవాకృతి నూనిన శ్రీమహావిష్ణువు తన విధికృత్యమును మఱచి; నేట రేపట నయోధ్యా

నగరంబునఁ బట్టభద్రుఁడు గానుండెఁ. అటుల జరిగినచో మనకు దానవులబాధ లెటులఁ దప్పగలవు? లోకంబునకు శాంతి కలుగునా? అదియుఁ గాక దశరథున కింకఁ బదునాలుగు ఘడియలును, రావణునకుఁ బదునాలు గేఁడులును మాత్రమే కదా యాయువున్నది? వీరి యాయువులను సకాలమునకుఁ బూర్తిచేసి మనవిధులను నిర్వర్తించుకొనవలదా? అందుల కేదేని నొకపన్నుగడఁ బన్నవలదా? సకలలోక రక్షకుఁడగు శ్రీమన్నారాయణమూర్తియే యిటు లుపేక్షసేసిన మన యగచాట్లఁ దప్పించువారెవ్వరు? మూటముల్లెలఁ గట్టుకొని యాలుబిడ్డలతో నెటకుఁజేరి తలలు దాఁచుకొనఁగలము? సర్వమయుండగు, నారాయణుఁడే యిట్టు లుపేక్షయొనర్చిన మనకు నిలువ నీడయేది? కాన మనము జాగరూకులమయి శ్రీరాముని పట్టాభిషేకమునకు భంగముఁగలుగఁజేయు తెఱవునాలోచింపవలయు" నని తమలోఁ దాము సంభాషించుకొనుచుండ సతీయుతుఁడై యొక్కచో నా సభయందుఁ గూర్చుండిన విధాత తన భార్యదెసఁ జూచెను. దాత మనోభీష్టమును గుర్తించినది సరస్వతి. వెంటనే లేచినది. సభవంకఁజూచినది.

సభాసదులారా! మీరంద ఱిట్లేల దిగులుఁ జెందెదరు? ఆకార్యభారమంతయు నాపై నుంపుఁడు. పట్టాభిషేకసమయమున శ్రీజానకీరాములను జక్కగ నలంకృతులఁ గావింపవలెననెడి యుత్సాహముతోఁ గైక చెలికత్తెయగు మంథర

యుద్యానవనంబుఁజేరి తదేకనిష్ఠతోఁబూవులసేకరించి మాలికల గుచ్చుచున్నది. శ్రీరామచంద్రుఁ డొకప్పుడు తన్నేదియో నొకకారణమున మందలించెననెడిహేతువుచే సమయము వచ్చి నపుడు శ్రీరామచంద్రునకు ప్రతిక్రియఁ జేయవలెననెడి దురభిప్రాయమున నున్న మంథర తన క్రోధమును తానే మఱచి పోయినది. నేనిప్పుడే పోయి యామెజిహ్వాగ్రమునఁ బ్రవేశించెద. ఆబిడ యుత్సాహమున కంతరాయముఁ గల్పించెద. మదీయ ప్రభావముచే నామెను దాండవ మాడించెద. దశరథుఁడు మున్నొక్కప్పుడు కైకకొసంగిన వరంబుల నామె హృదయమునఁ బ్రవేశపెట్టెద. ఆవరంబుల మాటయే మఱచి శ్రీరామపట్టాభిషేక విలోకనార్థమై నిముషముల లెక్కఁ బెట్టుచు నానందపారవశ్యయై యుప్పొంగుచున్న కేకయరాజ తనయ కారెండువరంబుల విషయంబు జ్ఞప్తికిఁ దెప్పించి విచిత్ర నాటక మొక్కండుఁ బ్రదర్శింపఁ జేసెద. శ్రీరామున కరణ్యావాసప్రాప్తిఁ గల్గించెద. అంతట మీకోరికలన్నియు నెఱవేఱఁ గల" వని పలుక నామె యాలోచనమున కందఱును హర్షితస్వాంతులై యట్టులొనర్ప సమ్మతించిరి.

5

భారతీదేవి యత్నము సార్థకమైనది. శ్రీరామున కరణ్యావాసమును వల్కలాజినధారణమును సంప్రాప్తమైనవి.

తన్నుఁడబాయఁజాలక వెంటఁబడిన సౌమిత్రితోడను, "పతితోడిదియే సతికి లోకం" బనియెడి సతీధర్మంబును బాటించి వెంటవచ్చెదనని మాఱాముఁజేసిన జానకీదేవితోడను, వనంబుల కరుగుటకు నిశ్చయించుకొని, స్వజనంబునెడఁగల ప్రేమపాశబంధముల సడలించుకొని సుమంత్రునిచేఁ గొనిరాఁబడిన రథమధిరోహింపసంసిద్ధుఁడయ్యె. శ్రీరామమూర్తియొక్క ప్రవాసమును గూర్చి వినిన ప్రజలెల్లయును రాముఁడులేని రాజ్యమందుండనొల్లక, వాని వెంబడింప మూటముల్లెలఁగొని యాలుబిడ్డలతోఁ గూడి ప్రయాణసన్నాహులై వచ్చి రథంబును వెంబడించిరి. "రామా! సకల సుగుణాభిరామా! రవికులాంబుధిసోమా! సంసార భీకరజలధి తరణివి, ధర్మాధర్మవిచక్షణదక్షుఁడవు, పితృవాక్యపరిపాలనా ధురంధరుఁడవు, సత్యపథానువర్తివి, ఎన్నో తపంబులఁ జేసి మిమ్ముఁ దనయులఁగాఁ బడసిన జననీజనకులఁబాసి, భాగ్యభోగంబులఁ దృణీకరించి, యిప్పటికన్న నెక్కుడు సుఖములు మీ పరిపాలనములోఁ బొందెదమని గంపెడాశతోనున్న మమ్ము వదలి యరణ్యముల కేగఁదలంచితివా? తండ్రీ! మా పాలిఁటనేగాక; ధర్మదేవతకును, సత్యదేవతకును, దైవమవు. ఆధర్మదేవతయు, సత్యదేవతయు నీ వియోగమును భరియింపనొల్లక నీ స్యందనమునకు ముందుగనే నడువ సిద్ధమైనవి. చూచితివా! రామచంద్రా! మా కింకెవ్వరు దిక్కు? నీ వియోగమునకు నీ తండ్రి

యుఁక బ్రతుకునే! వాని యవస్థఁ జూచుచు నీ తల్లి జీవించునే! ఇటుల నీ యిక్ష్వాకువంశమును క్రమముగాఁ ద్వరలో నంత రింపఁ జేయఁదలఁచితివా ? నీతో మమ్ములఁ గూడఁ గొనిపొమ్మని రోదనము సేయసాగిరి. రథము నడుచుచున్నది, శ్రీరామమూర్తి వారి నెట్టులేని సమాధాన పఱచవలెనని యెంతగనో ప్రయత్నించెను. కాని తత్కాలమున వాని కోరిక నెఱవేఱ లేదు. శ్రీరామచంద్రుని సుగుణసంపదలఁ గీర్తించుకొనుచు వాని యెడఁబాటునకు వగచుచు రథము వెంట నయోధ్యాపురవాసులు తండోపతండములుగ నడుచుచు వచ్చుచుండుటచే వారల సాధనాంతరముల శాంతింపఁ జేయవలయునని డియాశయముతోఁ దేరును మెల్లఁగా నడుప సుమంత్రునకు శ్రీరామచంద్రుఁ డనుజ్ఞ నిచ్చెను. అందుచే నాసాయంసమయంబునకు రథంబు సరయూనదీ తీరమునకు మాత్రమే చేరఁగల్గెను.

శ్రీరాముఁడు లక్ష్మణునితోడను, భార్యతోడను రథంబుడిగ్గి యానాటి కచ్చటనే విడిసెను. కాని శ్రీరాముని దూరకుండలేదు. వెంటవచ్చిన జనమున కంతకు నటఁగల ప్రకృతి విచిత్రములఁ జూపుటతోడను, వారినందఱి నెట్టులేని సాగనంపవలెనని యనేక విధములగు హితోపదేశ వాక్యంబుల తోడను నా రేయియెల్లఁ గడిపెను. మఱునాటి యుదయంబున శ్రీరాముని హితోక్తుల నాలించిన ప్రజలు వెనుకకుఁ దిరిగి

పోవుట కనుమతించి శ్రీరామాజ్ఞను బడసి వెడలిరి. ఇఁక సుమంత్రుఁడుమాత్రమే మిగిలెను. ఇతఁడును వీరిని నదీతీరమునకుఁ జేర్చి వెనుకకు వెడలవలసినవాఁడే. కావున సుమంత్రునకు దిగులు హెచ్చుకాజొచ్చెను. వాని వైఖరిని గుర్తించి శ్రీరాముఁడు "సుమంత్రా! నీవుఁగూడ మమ్ము వీడి వెడలవలయుఁ గదా! నాతండ్రిగారికిని, తల్లిగారికిని, చిన్నమ్మలకును, దదితర పెద్దలకును, ముఖ్యముగ మాకులగురుండగు వసిష్ఠమునిచంద్రునకును నమస్కరించితి" నని చెప్పుము. పిన్నలకు దీవెనల నెఱింగింపుము. నన్నుఁగూర్చి విచారింపవలదని ప్రార్థించితినని యెల్లఱకుఁ దెలుపుము. మఱియు, సుమంత్రా! నీకొక రహస్యముఁ దెలిపెద నాకర్ణింపుము.

"నలువ మనల సృష్టించునపుడు ఫాలతలంబున వ్రాసిన వ్రాతను మనము తప్పించుకొనఁ జాలము. మమకారాదులఁ బెంచుకొని యెవరెంత విలపించినను బ్రయోజనములేదు. భగవంతుఁడు నన్నెందుల కీజన్మమెత్తించెనో నన్నేరీతి జీవింపఁజేయ దలఁచెనో, నానిర్యాణమెటు లున్నదో యేమని చెప్పఁగలను? నాకీయరణ్యవాసప్రాప్తిని గలుగఁజేయుటయందు భగవంతుని యుద్దేశమేమో మనమెటుల గ్రహింపఁ గలుగుదుము? కాని యొక విషయమును మాత్రము మనము సులభముగాఁ దెలిసికొన నగును. ఆపరమాత్మ మనకొక కష్టమును బ్రాప్తింపఁ జేసినపుడు దానికేదియో మహత్తరమగు కారణ ముండక

పోదు. క్రూరరాక్షసులవలన లోకమెంత కటకటఁ బడుచున్నదో! క్రూరమృగ సంకులంబగు నడవిని పాంథులేవిధి హింసింపఁ బడుచుండిరో? అందులకుఁ గాను లోకమునకు నేనెట్టిసేవఁ జేయవలయునో? ఆభగవంతుఁడు నాకీ యరణ్యవాసోద్యోగమిచ్చుట లోకోపకారమునకేయని తలఁచెద. ఇయ్యది మనము సంతసింపవలసిన విషయముగాని యీశ్వరప్రేరితకార్యమున కెద్దానికిని మనము విచారింపరాదు. క్షత్రియకులోద్భవుండనై, రణధర్మముల నామూలాగ్రముగ నభ్యసించి, మేటిబలాఢ్యుఁడనని పేరుఁ బెట్టుకొనినందుల కింటఁ గూర్చుండి తలిదండ్రుల గారాబముల నందుచు, ముఖప్రీతికొఱకై వారు వీరు చేయుస్తుతుల నాలింపుచు నాలితోఁ గూడి సరససల్లాపంబులతోఁ బ్రొద్దుఁబుచ్చుచుఁ దమ్ములతోఁ గ్రీడావిలాసంబులొనర్చుచు జన్మమును నిరర్థకముఁ జేసికొనినచో మనపరిపాలనమునందలి సరిహద్దులలో నున్న యరణ్యంబులయందుఁ బర్ణశాలల నేర్పరచుకొని వాతాంబు పర్ణాహారులై శ్రీహరినామోచ్చారణా తత్పరులై కాలంబుఁ గడపుచున్న తాపసుల క్షేమంబుల విచారింపలేదని కలిగెడి యపవాదమును భరియింపవలదా! అందుచే నాకీప్రవాసశిక్ష యెంతయు నర్హమైనది.మఱియొక విశేషము. తాపసులదర్శనము నాకుఁ దఱచు లభియింపఁగలదు. వారిపాదాశ్రయముసకలమానవులకును నవశ్యవాంఛనీయము.వారిహితవాక్యంబులననవరతమాలించుచుమనజీవితముల

సార్థక మొనర్చుకొననగును. జగన్మాన్యతను గూర్చియు, సర్వ భూతదయను గూర్చియుఁ, బరోపకృతిని గూర్చియు, నింకను యోగ్యములైన విషయంబులను గూర్చియు వారినోట వినుచున్నపుడు మనకుఁ గలిగెడి యానందమునకు మేఱకలదా!" యని హితంబుఁ గఱపుచు బుజ్జగించెను.

సీతాలక్ష్మణు లీప్రసంగముల నతి శ్రద్ధాభక్తులతో నాలించుచున్నవారగుటచే నెప్పుడు మన మాయరణ్యములఁ జేరుదుమా, ఎన్నఁడామహానీయుల దర్శించి వారి హిత వాక్యంబుల నాలింతుమా, వారి పాదముల నెప్పు డాశ్రయింతుమా! యనెడి యాతురమునే జూపుచుండిరి. కాని తమ యెడఁబాటు వలన నింటికడ విలపించుచున్నవారి గోడవయే తలంపునకుఁ దెచ్చుకొనుట లేదు. కాదా మఱి.

లోకకల్యాణము నొడఁగూర్ప నవతరించిన పరాత్పరుని సాహచర్యము లభియించినది. విఖ్యాత పురుషులను, శ్రీమన్నారాయణ పదారవింద భజనానంద సంయుక్తులను దర్శించి ధన్యులయ్యెడి వీలు చిక్కినది. ఈయవకాశము నెవ్వరు చెడఁగొట్టుకొందురు? సమయమునకుఁ జెడఁగొట్టుకొని పడంపడి విచారించిన మాత్రము ప్రయోజనమున్నదా !

చచ్చునపుడు; నెంటరాని భోగభాగ్యంబులను, బంధు మిత్రులను విడలేక, నధోగతిలో మునుంగుదురా!

[6]

గంగ పరమ పావనమైనది. అయ్యది శ్రీమహావిష్ణువు యొక్క పాదంబులయం దుద్భవించినది. ఆ వియన్నదిలోనయందు స్నానమొనర్చుచో సకల కలుషమ్ముల నాశమ్మొనర్తునని సర్వకాలంబులందునను సర్వమానవులకును స్వాగతం బిచ్చుచుండును. మఱియు నానదీజలము మానవుల కారోగ్య దాయకమై దనరారుచుండును. పావనంబగు నానదీ నీరంబు శాంతిశమ దమాది సద్గుణంబుల నలవడఁజేయును. మేథాశక్తి వృద్ధిఁజేయును. భగవంతునియెడ ననురాగమును గలుఁగఁజేయును. మహాపర్వదినంబులయందానదీమతల్లికి భక్తులగువారు పసుపుఁగుంకుమలతోఁ బూజింతురు. విశేషముగా తమహృదయముసైతము సమర్పింతురు. ఆదివ్యస్రవంతి ప్రవహించు ప్రదేశమంతయు నతిపవిత్రవంతమైన దగుటచే నా యా ప్రాంతముల వసియించెడి ప్రజలు తమప్రదేశములను మహాక్షేత్రములని వాకొందురు. దివ్యస్వరూపుఁడును పరాత్పరుఁడును నగు శ్రీమన్నారాయణుం డనేక రూపములతో నానదీతీరంబుల నచ్చటచ్చట వెలయుచుఁ దన్ను నమ్మికొని జీవించువారి నేదోవిధముగాఁ దనకడకు రప్పించుకొని వారి యాశయముల నెఱవేర్చుచుండును. ఇట్టిమహత్తర శక్తిగల యానదిని యిప్పుడు శ్రీరామచంద్రమూర్తి దాఁటవలయును ఆనదిని దాఁటుట కొక నావకలదు. మనకథానాయకుఁడగు

గుహుఁడే యీనావకధికారి. గుహునిపూర్వజన్మవృత్తాంతమును మీరు మూఁడవ ప్రకరణమునందుఁ బఠించియే యున్నారు. వాని విశేషముల మఱికొన్నిఁటి నీక్రింది ప్రకరణంబునఁ బఠింపఁ గలరు.

(7)

తండ్రిశాపవచనముల ననుసరించి మునిబాలుఁడు నిషాద కులంబున జన్మించి గుహుండను పేరుఁగాంచి యనాగరిక ప్రదేశమగు నా యరణ్యప్రాంతమున నావికావృత్తితోఁడను, కులవృత్తితోఁడను జీవించు చుండెను. బాల్యమునుండియు దయా సత్య శౌచముల ననుష్ఠించుచు శ్రీరామనామసంకీర్త నానందుఁడై ప్రవర్తించుటచే నతనిజన్మము సార్థకమై దనరారు చుండెను. నిషాదులనిన నిన్నమొన్నటివఱకును వారి పూర్వ వృత్తాంతముల సరిగా నెఱుంగఁజాలము. మనము పల్లెకులజు లని తలఁచుచుండెడివారము. ఇప్పుడో ఆ కులజులు తమ పూర్వవృత్తాంతమును దెలిసికొని తా మగ్నికులక్షత్రియులని పేరుఁగాంచుచున్నారు. ఆ కులజుల నటులనే వ్యవహరింప, మన ప్రభుత్వమువారు ముదల నొసంగిరి. ఇప్పుడాకులజులు నాగరికత నలవడఁజేసికొని విద్యాబుద్ధులనేర్చి యుద్యోగములఁ జేయుచుఁ గీర్తిఁ గాంచుచున్నారు. పూర్వ మొకప్పు డీకుల జులు ప్రపంచమందలి యన్నిభాగముల సంచరించుచు నోడ వర్తకమునందు సుప్రసిద్ధులై మన భరతఖండమునకు వచ్చెఁ

దెచ్చి యున్నారు. కాలక్రమమున నిప్పుడావిఖ్యాతి నామ మాత్రావశేషమై యున్నను మఱల నా కులజులు కన్నులు తెఱచి తమ పూర్వగౌరవమును బునరుద్ధరించుకొన విశ్వ ప్రయత్నములఁ గావించుచున్నారు. శ్రీరామచంద్రమూర్తి వారి ప్రయత్నముల జయప్రదము గావించి యా కుల జుల సన్నివిధంబులఁ గాపాడుఁగాక. గుహుండు నిషాదుఁడై జనించిన నాటఁగోలె రామనామపఠనముఁ జేయుచుండె నని చెప్పియుంటిమి. అంతటితో నాతండు తనివిఁజెందకఁ దనపురంబున వసించువారి నెల్లఱ రామభక్తులఁ గావించెను. కాని శ్రీరామచంద్రుని యాకృతి యెట్లుండునో, వాని వర్త నాదికము లెట్టివో స్వయముగాఁ బరికించి యెఱుంగఁడు. ఐనను దశరథక్ష్మాపాలుని తనయుండనియుఁ, దనకుఁ బ్రభుం డనియు, విశేషించి మోక్షప్రదాతయనియు, భగవంతుఁ డనియుఁ, దన్నునమ్మి సేవించువారి కిహపర సౌఖ్యంబులం జేలోటుపాటులు రాకుండఁ గాపాడఁగలఁడనియు, దయా సత్యశౌచశాంతిశమదమాద్యనేక సద్గుణంబుల కలనాటు పడ వలయు ననిన వాని పవిత్ర నామస్మరణమే తగిన మార్గ మనియు మాత్ర మాతఁడెఱుంగును. సుఖములు చేకూఱినను దుర్భర దురంత కష్టములు వెన్నాడినను నవి యన్నియు శ్రీరాముని యనుగ్రహము వలననే సంప్రాప్తమయ్యెనని తలంచును. కాని సుఖములకు సంతోషించి యెఱుంగఁడు.

కష్టములకు విచారించి యెఱుఁగఁడు. కలిమికలిగిననాఁడు మైమఱువఁడు. లేమిదశయందుఁ బ్రలాపించియెఱుంగఁడు. ఆతని నేత్రములకు గోచరములగు సమస్త జీవరాసులును, సకల చర్యలును శ్రీరామునిసృష్టి యనియే, శ్రీరాముని విలాసము లనియే భావించును.

తాను వసియించు పల్లెయం దొక దివ్యమందిర నిర్మాణముఁ జేయించి, తాను పెద్దలవలన వినినయట్లుగ శ్రీరామ చంద్రునిదివ్యమంగళవిగ్రహముఁ జేయించి, యందుఁ బ్రతిష్ఠించి, నిరంతరమును వాని భజించుచు నానందపడుచుండును. గుహుండు శ్రీరాముని స్వయంబుగా నెఱుంగకున్నను తాను వినిన చందమున నాతఁడు శ్రీరాముని రూపమును దనహృదయ ఫలకంబునఁ గూడఁ జిత్రింబుగా లిఖియించుకొనుటచే నేవేళయందు శ్రీరామమూర్తి స్వయంబుగాఁ గాన్పించినను నానవాలుఁ బట్టఁగలఁడు. ఆకాలమున మనము గుహుని జూచియుండుట తటస్థమై యున్నచో శ్రీరాముఁ డీతని హృదయంబునఁ బ్రవేశించి సకల మానవులఁ దన పవిత్రనామ మును జపియింపఁజేసి యీవిశ్వమును బవిత్రపఱచుచుండెనా యనెడి యబ్బురమును దప్పకఁ జెందెడివారము.

రామభక్తుఁ డైనంతమాత్రమున తన కులవృత్తిని నిర సించి యూరకుండెనా? కులవృత్తికి లోనై, ధనమే ప్రధాన మని యిహపరసాధక మార్గంబులఁ ద్యజియించుకొనెనా ?

తాను నిర్వహింపవలసిన కార్యములను జేతిక్రిందఁ బరిచారకు లెందఱో కలరు గదా యనెడి గర్వమున నితరులచేఁ జేయిం చెనా! ఒడలు దాఁచుకొనక, నీతిఁద్యజింపక, దైవమును మఱువక, సత్యముఁ దప్పక, ద్రవ్యమాసింపక, విసుఁగు వహింపక, కోపమూనక, రేయియనక, పవలనక, ఎండయనక, వానయనక, చలియనక, విశ్వసేవావ్రత పరాయణుండై ప్రవ ర్తించు గుహుని వర్తనమును గూర్చి వ్రాయుట కొక కవిచాలఁడు.

తాను నడిపెడి నావ నెక్కు-వారికడనుండి ప్రతిఫల ముగాఁ జిల్లి గవ్వనేనిఁ గొని యెఱుంగఁడు. ప్రతిఫలాపేక్షా రహితుఁడై నావను నడుపుకొను గుహుండు తన దారాసుతా దుల నెటులఁ బోషించుచుండెడివాఁ డను సందియము ప్రతి వారికిఁ గలుగుట సహజము. గంగ కిరుప్రక్క-లనుండు భూమి యంతయు నరణ్యమే. ఆయరణ్యమునిండఁ గావలసినన్ని దుంప లును, గాయకూరలునులభియించెడివి. నీరమునకా కొఱంతలేదు గదా?వియన్న దీనీరంబులెట్టివాని కేనినాకలిదప్పులని శ్శేషముగాఁ దీర్చుచుండ గుహునకింక లోపమేమియుండును? నివాసయోగ్య ములగుకుటీరముల నేర్పఱచుకొనుటకావశ్యములగు పర్ణములాది గాఁగల పరికరములన్నియు నాయరణ్యమున మిక్కు-టముగా లభియించుచుండుటచేత నాకొఱంత కూడ వానికి లేదు. ఇతర వస్తువులతోఁ గాని, యితర భోగములతోఁ గాని, యితర

ప్రసంగములతోఁ గాని వానికేమియుఁ బ్రసక్తి లేదు. పరులా నోటివెంట నితర ప్రసంగము లేమివచ్చినను జెవుల మూసికొని తన పనులయందే తాను నిమగ్నుఁడగును. ఆతని నావపై కెక్కువారలందఱును గాషాయాంబరధారులే. ఆకలములతో నాకలిని, గంగానదీ జలంబులతో దప్పిని దీర్చుకొనెడివారే. శ్రీహరి నామ సంకీర్తనా నిరతులే. అపార తపోవ్రత వ్యాపార పారీణులే. శాంతహృదయులే. నిరాడంబరప్రవృత్తిఁ గలవారే. నిష్కామ యోగాభ్యాసకులే. అందుచే నాతని సుగుణాబు లకుఁదోడు సజ్జన సహవాసముఁగూడ చక్కఁగా నలవడినది. ఈ సజ్జన సహవాసము వలన నాతఁడు పరిపూర్ణ విజ్ఞాన దక్షుఁడై నాఁడు.

శ్రీరామాదులు గంగాతీరమునకుఁ జేరుసరికి నావ యావలిదరి నున్నది. మఱల నీవలి యొడ్డునకు వచ్చుటకుఁ బాంధులు వచ్చియుండలేదు. అందుచే నించుకంత యాలస్య మయ్యెను. శ్రీరాముండు సీతాలక్ష్మణులతో నత్తాపున నున్న యిసుకతిన్నెలపైఁ గూర్చుండి యాస్థలవినోదములఁగూర్చియు, నీశ్వరుని సృష్టిచాతుర్యముఁ గూర్చియు, వారికిఁ దెలుపు చుండెను. గుహుం డావలియొడ్డున నుండియే యీదరికిఁ జేరిన శ్రీరామచంద్రాదుల యాకారముల బాగుగాఁ బరికించి వారిలో శ్రీరాముఁడు కలఁడని నిశ్చయించుకొని తనకు జగత్కల్యాణ సంధాయకుని దర్శింపఁగల భాగ్యమబ్బినది గదాయని సంత

సించుచు నెప్పుడీదరికివచ్చి శ్రీరాముని పాదారవిందములకు నమస్కరింతునా యనెడి యాతురముం జూపుచుండెను. ఈయొడ్డుననున్న లక్ష్మణుండు పల్లెకులజుఁడై నావనడుపుట యందు సుప్రసిద్ధుఁడై తానొంటిగా నావనీదరికిఁ గొనిరాఁగల శక్తియుండియు నిర్లక్ష్యము సేయుచుండెనని లోలోనఁ దలంచుచు సాధ్యమైనంతవఱకు కన్నగారు గుర్తింపకుండునటులఁ దన సహజక్రోధమును గ్రమక్రమముగాఁ బ్రకటముఁ జేయుచుండెను.

ఇంతలోఁ దెఱువరులు కొందఱు వచ్చిరి. శ్రీరాముండు గుహునిదెసఁ జూచి "ఓయీ ! పల్లెవాఁడా! ఇంకనైన పడవ నీవలికిఁ ద్వరితముగాఁ గొనిరమ్ము,ఇప్పటికే కాలాతీతమైన"దని కేకవేసెను. గుహుం డాకేకను వినిపించుకొననటుల నటించుచు బాటసారుల నావపై నెక్కించుకొని వచ్చుచు సగము దూరము వచ్చినపిమ్మట శ్రీరామాదులు వినునట్లుగా నా పాంథులతో "నార్యులారా ! వింటిరా! నేను పల్లెవాఁడనఁట. ఆకేకవేసినయతండు పల్లెవాఁడుకాఁడట. తన్ను నేనెఱుంగనని, తన కులగోత్రాదులఁగూర్చి నేను వినలేదని, మాయిరువురకుఁ గల సంబంధ బాంధవ్యముల మఱచితినని,నేనే నావదాటించెడి వృత్తియందుండి తనవృత్తికిఁ బోటీగానుంటినని మీయెదుట నల్లరిచేయవలయునని యటులఁ బ్రవర్తించుచున్నాఁడు. ధనువుఁ జేతధరించినంత మాత్రముననే కులము దాఁగునా! వృత్తి

దాఁగునా? పంచాంగము లగుపించనికారణమున నక్షత్రము లగుపింపవా? నన్ను హేళనచేసెడి యీపురుషునియందు నేనేల గౌరవముంచవలెను? కానిండు. ఆదరిఁ జేరనిండు. మీయందఱి సమక్షముననే యాతండును నావలెనే పల్లెవాఁడనియు, నావ నడుపుచు వ్యవహరించువాఁడనియు నేను నిరూపించెదను.

ఒకవేళ నాకంటెఁ దనకెక్కుడు ప్రజ్ఞ యుండవచ్చును. తన్నుమించెడివా రీచతుర్దశభువనంబులందు లేకపోవచ్చును. అంతమాత్రముచే సాటివృత్తిఁగలవాని నన్నధిక్షేపింపఁ దన కుచితమగునా!" యని చెప్పుచుండెను. వినుచున్న యాతెఱు వరు లాశ్చర్యచకితులగుచుండిరి. వారును శ్రీరాముని యెఱింగిన వారే. వాని యత్యద్భుత మాహాత్మ్యములఁ దెలిసికొనినవారే. కాని యాతఁ డేయభిప్రాయముతో నటుల శ్రీరామునియెడఁ దిరస్కార భావమును జూపుచున్నాఁడో గుర్తింపలేకుండిరి.

నావ యీవలయొడ్డునకు వచ్చుచునేయున్నది. గుహుం డవ్విధంబునఁ బలుకుచుండియుఁ దనకార్యమును మఱచియుండ లేదు. గుహునివాక్యంబులు వినుసరికి లక్ష్మణునకుఁ గోపము వచ్చినది. లేచినిలువబడి గుహునిపైవిడువ బాణమును సంధిం చెను. రాముఁడుచూచి "లక్ష్మణా! ఏమది? ఇప్పుడు నీవు ధను ష్పాణివై నిలువఁ గతంబేమి!" యని ప్రశ్నించెను.

"అగ్రజా! హీనకులజుండయ్యు మనపరిపాలనమునకు లోఁబడినవాఁడయ్యు జగత్పూజ్యుండవనియెడి తాత్పర్యము

లేక నిచ్చవచ్చినటులఁ బ్రేలుచున్న నాతుంటరి వాక్యంబుల నాలించితివే? అట్టికర్ణకఠోరవాక్యంబుల నాలించిన నామనం బూరటఁజెందఁగలదా? ఇట్టి పరమదుర్మార్గుని వెంటనే రూపు మాపకున్నఁ బ్రపంచము నిలువఁగలదా! అన్నా! విజ్ఞాన సంపన్నా!తత్క్షణంబాజ్ఞనిచ్చున''దని లక్ష్మణుండువాకుచ్చెను.

"లక్ష్మణా! ఈశ్వరసృష్టియందు హీనకులజులనియు, నగ్రజులనియుఁ దారతమ్యములేదు. ఈశ్వరునిదృష్టియం దెట్టి భేదభావమును గన్పట్టను. వృత్తులను బట్టి వారిలోవారు కులములేర్పఱచుకొని ప్రవర్తించుచున్నను గౌరవముపట్ల నందఱును సమానులేగదా? నేను "బల్లెవాడా"! యని సంబోధించుటలో దోసమేమున్నదియో,అందులకాతండు సమాధానమేమి చెప్పునో విచారింతము. నీకోపము నుపసంహరించు కొనుము. మన మేవిషయమునందును దొందరఁ జెందరాదు. ఎదుటివారి మనోభిప్రాయములను బాగుగా గ్రహింపవలయును. ఆతఁడీదరికి వచ్చునుగదా? అటుల నేలఁబలికెనో వానినే యడిగిన నీసంశయములు తీఱఁగలవు. ఆనావపై వచ్చెడి జనము నందునిల్పి వాని సమాధానమెట్లుంగి దోషిమైనచోఁ దగినటుల మందలింపనగును. మఱియొక విశేషము. నేను వచియించు యీసదుపదేశమును నీ హృన్మందిరంబున నిలుపుకొమ్ము. నీవు సహజకోపిధుఁడవు. మనము పోవ నున్నది విపినములకు. అందు జడదారు లనేకులు కాన్పింతురు.

వారు మనకు సదాపూజనీయులు. ఎదుటవారి స్వభావమును బట్టియు, వారివర్తనాదికములఁ బట్టియు మనము నడుచుకొన వలయును. మన ధర్మంబుల మనము పాటింపకున్నచోఁ గలిగెడి యపకీర్తి యింతయని చెప్పలేము. ఇంతియే ప్రస్తుతము నేను చెప్పున”దని శ్రీరాముఁడు తన సహజశాంతవచనములతో లక్ష్మణుని శాంతపఱచెను.

ఇంతలో నావవచ్చినది. బాటసారులు నావపై నుండి దిగిరి. వారితోఁబాటు గుహుండును దిగెను. బాటసారులొడ్డున నున్న సీతారామలక్ష్మణుల యపూర్వతేజోవిలాసముల సందర్శించుచు నిశ్చేష్టులయి యుండిరి. పూర్వజన్మ సుకృతముచే లభియించిన విజ్ఞానముచే గుహుండు శ్రీరామునకుఁ దొలుత ప్రదక్షిణ నమస్కారములఁ గావించె. పదంపడి సీతాలక్ష్మణులకుఁ బ్రణమిల్లెను. శ్రీరామచంద్రుఁ డాపాంథుల కుశలంబులఁ గూర్చి తెలిసికొనెను. వారును అచ్చటచ్చట రాక్షసులవలనఁ బడుచున్న బాధలను గూర్చి యోజింగించిరి. రాముండు చిఱునవ్వు మోమునఁ దాండవింప గుహునిదిక్కు “ఓయీ! ఇంతకుమున్ను నీవు నావఁ గొనివచ్చుచు నీ తెఱువరులతోఁ బ్రసంగించుచున్న వాక్యముల నా కెఱింగించి నీ వాక్యంబుల సమర్థించుకొని మా లక్ష్మణునకుఁ గలిగిన సంశయంబుల నివారింపు” మనియెను.

గుహుఁడు కరంబులఁజోడించి "శ్రీరామచంద్రమూర్తీ నేనల్పుఁడను. నీవధికుఁడవు. ఆర్యుఁడవు. ఆదిమధ్యాంతరహితుఁడవు. సర్వభూతాంతర్బహిస్సంగతుఁడవు. నీయెదుటనిలిచియల్పజ్ఞుఁడను నేను మాటాడుటయన నెట్టులుండునో నీవెఱుంగనిదియా! ఏకార్య నిర్వాహణంబునకై నన్నీయెడనిల్పితివో నీకుఁదెలియనిదియా! ఇట్టులనేకదా! నీవుచిత్రవిచిత్ర నాటకములనాడించుట? ఏవానిముఖారవింద సందర్శన మహాభాగ్యమును బొందఁగోరితినో అట్టి మహానుభావునిఁ గనులారఁ గనుఁగొనుటచే నాజన్మము పవిత్రమైనది, నాపాపంబులు పటాపంచలైనవి. ఓకౌసల్యాగర్భ జలధిరాకాసుధాకరా! నేనుమిమ్ముల నాకులమునకుఁ బెద్దఁగాఁజేసి యీమహాత్ములతో వచియించుచుంటిని. అట్టులాడఁదగిన హేతువేమని నీవడుగుచుంటివి. ఇంతకుమున్నే నా వాక్యంబులందు దోసంబు లుండియుండు ననెడి యభిప్రాయముతో యిమ్మహానుభావుండు నాపై బాణముఁ బ్రయోగింపఁ దలఁచినాఁ"డని లక్ష్మణునిఁ జూపుచు మఱల నిటులఁ బలికెను. "ఓ ప్రభూ! నేను వానికిఁ దెలిపిన యంశముల మీ సమక్షంబున మఱలఁ దెలుపుచున్నాఁడను. నా వాక్యములందుఁ దప్పులున్న క్షమింపుఁడని వేఁడువాఁడను గాను. నేనుకొద్దిపాటి వెడల్పుగల యీ నదిని మాత్రమే దాఁటించువాఁడను. అంతవఱకే నా కు శక్తి గలదు. ఇఁకనీవో అపారసంసారపారావారంబునఁబడి దా

తెన్నుఁ గనుఁగొనలేనివారి నందఱి నొడ్డుఁ జేర్పఁగల నావికుఁడవు. అందులకు సమర్థుఁడవు నీవొక్కరుఁడవే. నీయట్టి మహానావికుఁ డీపదునాలుగులోకంబులం దొక్కఁడు కలఁడే? నావికత్వమున నాకన్న నెన్నికోట్లుమడుంగులో యెక్కుఁడగు వాఁడవు, సందియంబు లేదు. కాని వృత్తియందు సమానులమే కదా! అట్టి యెడ నిన్ను పెద్దపల్లెకారీ! యని పిలుచుటలో లోపమున్నదా! ఈ పథికు లీరహస్యము నెఱింగిన వారయ్యును నాహృదయమం దడఁగియున్న నిశ్చితోద్దేశమును వెలిఁబుచ్చితిని. నీవట్టి నావికుండ వగుదువో కావో; ఒడుదుడుకు లెన్ని వాటిల్లినను యొరుల సహాయ మపేక్షింపకయే నిన్ను నమ్ముకొని వచ్చువారి నుద్ధరింతువో! లేదో! నావ నడుపుటయందు నాకుఁ దగిన నేర్పు లేదని నన్నుఁ బరిహసించుచుంటివో! లేదో! నిక్కంబు వక్కాణింపుము." గుహుని విశాల హృదయంబునకును నిష్కామైక భక్తికిని శ్రీరాముఁ డెంతయు సంతసించి లక్ష్మణుని దిక్కయి "సౌమిత్రీ! గుహుని వాక్యంబుల వింటివికదా! ఇప్పుడు నీబాణమును ప్రయోగింపవచ్చునని" యనెను. లక్ష్మణుఁడు తన రెండు చెంపలను వాయించుకొని రాముని పాదములపై వ్రాలి "అన్నా! విజ్ఞానసంపన్నుఁడవు, పితృ సముఁడవు, నాయెడ బ్రేమఁ జూపువాఁడవు. పోషకుఁడవు; అజ్ఞుఁడనై యవాచ్యములఁ బ్రేలితిని. ఈగుహుం డింతటిమహత్తరమగు భక్తిగలవాఁడని తెలిసికొన

లేకపోతిని. అంతదనుక నీయెడ నేనే దృఢమైన భక్తిఁగలవాఁడ ననియెడి గర్వముతో నుంటిని. ప్రపంచమున నన్ను మించిన మహాభక్తులెందఱో గలరనియెడి యాదార్థ్యము నిప్పుడే యెఱింగితిని. నన్ను మన్నింపుము. అని ప్రార్థించెను. వెంటనే రాముండు "తమ్ముండా! లెమ్ము భయములేదు. క్షమియించితిని మడుకుండన మొన్నటికేని హానిదెచ్చును. ముక్కుపచ్చ లాఱని వారము. ప్రాపంచికానుభవము లేనివారము. నూతనముగా స్వయంకృషిచే లోకజ్ఞానమెఱుంగ నభిలషించి యీప్రాంతములకు వచ్చినవారము.మనస్వగుణములను బాగుచేసికొనుచు లోకమున కాదర్శప్రాయుల మైనపుడే యొరులలోపముల విమర్శింపవలయును. అప్పుడు మాత్రమే యొరుల దురహంకార మడంపవలయును. మనవాదము సహేతుకముగా నుండ వలయును. జీవకోటి కంతకును మనదయారసంబును బ్రకటింప వలయును. క్షత్రియ కులోద్భవులమని, బాహుబలపరాక్రమ సంపన్నులమని, యధికారులమని, ధనుర్విద్యానైపుణ్యులమని యెవ్వరినో బక్కరక్కసులఁ బదిమందినిఁ గూల్చితిమని మన బాహుబలమును వ్యర్థముగా నేరిపైఁ జూపరాదు. గుహుని వాక్యములలో నెట్టియంతరార్థము కలదో, యెట్టి మహత్తరము లగు విషయములను మనము గ్రహింపవలసి యున్నదో, యట్టివాని కెట్టిపదవి యిచ్చిన లోకము సంతసింపఁగలదో వానివాక్యమున కెట్టి సమాధాన మిత్తువో యోచింపుకొను"

మని హితంబులఁ గఱపుచు గుహునిదిక్కై "పిన్నవాఁడగుటచే యుక్తాయుక్త విచక్షణ లేనివాఁడయి పలికిన పలుకుల కలుకఁ జెందకుము. నేను మందలించితి" ననుచుండఁగనే సుమిత్రా కుమారుఁడు గుహుని చెంతకుఁ జని వాని కరంబుల రెంటిఁ బుచ్చుకొని "ఓయీ! భక్తాగ్రేసరా! నీయాకారమును జూచి నీవుచేయుచున్న వృత్తిని జూచి, యజ్ఞుఁడ నగుటచే నన్యముగ భావించి తూలనాడితిని. క్షమియింపుము. సకలలోక సంరక్షణ కర్తయగు శ్రీరామచంద్రునిచే స్వయముగాఁ గీర్తింపఁబడిన నీవు; సంసారసాగరంబును దరింపఁజేయఁగల పరాత్పరునే నావపై నెక్కించుకొని యీ వియన్నదీ ప్రవాహమును దాఁటింపనున్న నీవు, తారకమంత్ర రహస్యమెఱింగి తదనుకూల వర్తివై మెలంగుచున్న నీవు, కంటకావృతమై క్రూరమృగ సంకులంబై యొప్పారు యీవిజనారణ్యమధ్యంబున యిట్టిమహాః తపస్సంపన్నుల సహచర్యముచేఁ బరిపూర్ణపండితుఁడవై విలసిల్లుచున్న నీవు, నీశక్తిని, నీవినయసంపన్నతను, నిని రాడంబర వృత్తిని నీనిష్పాక్షికబుద్ధిని నీఋజువర్తనమును, నీక్షమాగుణ సంపత్తిని నిగూఢముగ నుంచి, భస్మచ్ఛన్నానలునివోలెఁ బ్రవర్తించుచుంటివి. ఇట్టి మహత్తర గుణములచే విలసిల్లు నీయొక్క బుద్ధికుశలతనుఁ దెలిసికొని వర్ణించుట కొకనాలుక చాలునా? శ్రీరామ పదారవింద భజనానందమునఁనేమి? మఱొక గుణమునందేమి? నీకుసాటినీవే. సూర్యునకుఁ దేజము

చంద్రునకుఁజల్లదనము, చందనమునకుసుగంధము, సహజముగఁ గలిగినట్లు" నీకురామభక్తి, వినయసంపత్తి, మొదలగు సుగుణములు సహజముగనే కలిగినవి. అని గుహుని వినుతించి యాతని నానంద పరవశునిఁగావించె.

బాటసారులైవచ్చి నానదిగినవారు సామాన్యులుకారు. అఖండమహిమాన్వితులు. జితేంద్రియులు, నిర్లేపులు, నిరహంకారులు, శాంతమూర్తులు, తపస్సంపన్నులు, నగుపుణ్యపురుషులు. ఈనాటక ప్రదర్శన వీక్షణోత్సాహులై భగవంతునిచేఁ బ్రేరేపింపఁ బడినవారే. ఈశ్వరసంకల్పము లేనిచో నేకార్యమునకుఁ గారణముండదు. విజయముండదు. వారందఱు శ్రీరామమూర్తియొక్క పవిత్రచారిత్రము నప్పుడపుడు చూచుచున్నవారే. గుహుండు లక్ష్మణుని వినయంబున కెంతయో మెచ్చుకొనియెను. శ్రీరామునివంకఁ జూచెను. "ఓ సర్వకారుణ్యమూర్తీ! శ్రీరామచంద్రమూర్తీ! అంతయు బాగుగనే యున్నది; కాని యిట్టి రాజ్యమును విడిచి, భోగ భాగ్యంబుల దృజియించి, యీనారబట్టలతో, సీతమ్మని నీయిల్లాలిని వెంటనిడుకొని యీప్రదేశంబునకు విచ్చేయుటకు మహత్తరమగు కారణంబేదియో యుండనచ్చును; వినవర్హుఁడ నగుదునేని సెలవీయఁగోరెద "నన శ్రీరాముండు తదుదంతమును దెలుప లక్ష్మణున కాజ్ఞనిచ్చెను.

లక్ష్మణుండు తన తండ్రిగారిని కైకమ్మ కోరినవరంబులనుఁ గూర్చియు, నందులకై తండ్రిగారుపొందిన పశ్చాత్తాపమును గూర్చియు, శ్రీరాముని యౌదార్యవాక్యంబులఁ గూర్చియు, సవిస్తరముగా విన్నవించెను.

గుహుండు శ్రీరామారణ్యవాస కారణంబును గ్రహియించి దీనవదనుండై "రామా! సకలసుగుణాభిరామా! రఘుకులాన్వయసోమా! కైకమ్మకు నీవిభవంబులఁ జూచుటకుఁ గన్నులు గుట్టెనా! తండ్రీ! దివ్యభోగంబుల ననుభవింప వలసిన నీవు సామంతప్రభువుల కప్పంబులఁగొనుచు, వందిమాగధుల కైవారంబులఁగొనుచు, శత్రురాజన్యమస్తకంబుల నిరవశేషంబుగా ఖండించుచు, న్యాయాన్యాయ విమర్శనముఁజేయుచు, సమస్తలోకంబులను శాంతిప్రదముగాఁ బాలింపవలసిననీవు అయ్యో! జటావల్కలంబుల ధరియించి యరణ్యములకు వెడలి కందమూలాదుల నారగించుచు ఘోరమృగంబుల భీకరగర్జనంబుల నాలించుచు, గటికిరానేల గుడ్డఁబఱచుకొని పరుండుచుఁ బదునాలుగేండ్లిడుములఁ గుడువఁ దలఁచితివా! రామా! ఎట్టి విపరీతదశ వాటిల్లెఁ" దని విచారింపసాగెను. సీతమ్మను జూచి, ఈ కుసుమకోమలి, యీసుకుమారగాత్రి యెండకన్నెఱుఁగక చంద్రకాంత శిలాసౌధములలో హాయిగ నివసించి దాసదాసీజనములచే లాలింపబడుచు మెలఁగు, యీ రాజకుమారి, యీ దశరథక్ష్మాపాలుని మన్ననలందెడి

సాధ్వి, యీసకలలోకైక విభుఁడగు శ్రీరామచంద్రునియర్ధాంగి, యీ జనకాత్మసుత, యీ సీత, అక్కటా, దుర్విధి వశమున, కటికి, యీ మహారణ్యమునఁ బాదసంచారిణియై నడుచుచు కాయగడ్డలఁదిని యాకలి నడంచుకొనవలసినస్థితి వచ్చినదిగదాయని విచారించెను. అంత సౌమిత్రిని బరికించి రామానుజా! రామసేవ సలిపి రామకరుణకుఁ బాత్రులయి కృతార్థులగు వారిలో నీవు మొట్టమొదటివాఁడవు. నీజన్మమే జన్మము" అని లక్ష్మణునిఁ గొనియాడెను.

బాటసారులగు మునీంద్రులును, శ్రీ రామ చం ద్ర మూర్తియు నా గుహుని దగురీతి నోదార్చి కాలవిళంబనము లేకుండఁ దమ్మావలి యొడ్డునకుఁ జేర్పుమని యర్థించి నంత "బ్రహేంద్రాది దేవతావర్గమున కేని నప్రియత్నముగా లభియింపనేరనట్టియుఁ, దారకనామునైనట్టియు, బరమమునీంద్రుల పొగడ్తల ననవతరముఁ బొందునట్టియు మహా పురుషుండగు శ్రీరామచంద్రమూర్తి నావలిదరికిఁ జేర్చుట కేనెంత పుణ్యాత్ముఁడనో" యని యబ్బురమందుచు క్షణములో నా మహామహుల నందఱిని నావయెక్కించెను. చివఱకు శ్రీరాముండు మాత్రము నిలిచెను. "రామా! ఆగుమాగుము నీపాదములఁ గడిగెదను, ఆవలనావ నెక్కవచ్చును. మీపాదములం దేవస్తువునైన నాఁడువాండ్రఁజేసెడిశక్తి యున్నదఁట. నానావ యాఁడుదియైనచో నాకు వేరు జీవనాధారములేదు

నేనీనావనే యాధారముగాఁ గొని జీవించుచుంటి" నన సర్వజనహృదయాభిజ్ఞుండగు శ్రీరాముండుపక్కున నవ్వి "నీ యభీష్టమెటులనో యటులనే గావింపుకొ" మ్మని తన పాదంబులఁ గడుగనిచ్చెను.

సీత గుహుని నిరుపమాన భక్తివిలసనమునకుఁ బ్రేమాదాద్భుతములు మనంబున ముప్పిరిఁగొన, నిట్లు తలఁచెను, "అయ్యారే! ఈతఁ డెట్టి కృతకృత్యుఁడనవచ్చును? నీచకులమునం దీతఁడు జనించినను, శాంత భక్తి వైరాగ్యములచే నీతఁడు మిన్నయైనవాఁడు. రామభక్తి యీతనికి బ్రకృతి సిద్ధముగ వచ్చినదే కాని మఱి వేఱు కాదు. ఈగుహుని ప్రతిమాటయు, మన్మనోనాథుఁడగు శ్రీరామచంద్రమూర్తి హృదయము నాకర్షించు చున్నయది. ఎట్టియోగుల కేని నలభ్యంబగు మత్ప్రాణనాథునిదివ్యపాదతీర్థము గుహునకులభించుటచే నీతఁడసమాన సుకృతరాశియని చెప్పనొప్పును. ఈతఁ డనుపమపుణ్యవంతుఁ డగుటచేతనే, మన్నాథుఁడీతని ననుగ్రహించెను.

గుహుండు శ్రీరాముని పాదద్వయంబుల నెత్తిపైఁ జల్లుకొని తనివిఁదీఱ శ్రీరామ మహిమాభివర్ణనముఁ జేయుచుఁ దాను స్వయముగాఁ బడవ నెక్కించి యావలి యొడ్డునకుఁ జేర్చెను.

ఆదరిని వారినందఱిని దింపి తన భక్తినైపుణ్యముచే మఱల శ్రీరాముని నుతింపదొడంగెను. శ్రీరాముండు

వానియెడ దయఁగలిగి "మమ్మీ నావఁదాటించినందులకుఁ బ్రతిఫలముగా నేమికావలయునో గోరుకొ"మ్మన "దేవా! మహానుభావా! కోరుట కేమియున్నది? నాకు ధనధాన్యములు కావలయునా? అమూల్యాంబర భూషణంబులు కావలయునా? భోగములు కావలయునా! మిమ్మేతెఱంగున నీనదిని దాటించితినో నీవుఁగూడ నన్నావిధంబుగాఁ దరింపఁ జేయుటయే నేనుగోరున" దనియె. అందుల కెంతయో సంతసించి శ్రీరాముం డట్లనే యగుఁగాక యని యాశీర్వదించి వెంటనున్నవారితో వెడలి యందందుఁ దన దర్శనలాలసులై స్వాగతంబొసంగిన వారినెల్లఱ నాదరించి మొదటి ప్రకరణమున వచియించినదండకారణ్యమునకుఁ జేరి యట ప్రవాసకాలముఁ గడుపుచుండెను.

సంసారసాగరోత్తారకమగు శ్రీరామచంద్రుని పవిత్రనామాక్షరములను త్రికరణశుద్ధిగ నిత్యము జపించుచు, శ్రీరామానుగ్రహమునంది, శాశ్వతానందసౌఖ్యములనలరి, చిరయశోభిరాముఁడయి విరాజిల్లినవారిలో గుహుఁడే మొట్టమొదట లెక్కింపఁదగినవాఁడని యీ చారిత్రమువలన వేద్యమగుచున్నది.

అట్టి మహనీయుఁడనియు, నిష్కామైకభక్తివిలసనుఁడనియు, తెలిసికొనియే రావణసంహారానంతరమున సాకేతము

నకు శ్రీరామచంద్రమూ ర్తి పుష్పకమధిరోహించి మగిడివచ్చు నపుడు సాకేతపురమునకు గుహుని రావలసినదిగా శ్రీ హను మానునితో వార్తనంపి పట్టాభిషేక సమయమున గుహునిం బ్రేమపూర్వకముగ లాలించి శాశ్వతానందపదవి నొసంగెను.

స ం పూ ర్ణ ము.

---

ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలా ముద్రితము.

పాఠశాలల కుపయుక్తములగు

# మా స్వంత ప్రచురణములు.



1. పురాణ పురుషులు. దో॥ సీ॥
2. గుహుఁడు. కొ॥ స॥

(అచ్చులో నున్నవి.)

3. లక్ష్మణుఁడు. కొ॥ స॥
4. రావణుఁడు. డిటో
5. భగీరథుఁడు. డిటో
6. హనుమానుఁడు డిటో
7. శకుంతల. డిటో
8. అనసూయ. డిటో

వలయువారు:—పాలి పేరరాజు,

ఏలూరు, (పశ్చిమ గోదావరిజిల్లా.)

